# న మో వా క

[ నమకమునకు భావానుకరణ



మేడిచెర్ల ఆంజనేయమూ

త్రివేణి పబ్లిషర్సు, బం

# మోవాకము

నమకమునకు భావానుకరణము ]



మేడిచెర్ల ఆంజనేయమూర్తి

వేణీ పబ్లిషర్సు, బందరు.



కీ॥ శే॥ దేవభక్తుని లక్ష్మయ్య గారు.

వీరి జ్ఞాపకార్థమై యీ గ్రంథము వీరి రెండవ కుమారులగు

# తొలిపలుకు

సహృదయులకు వందనములు. నేను 'నమోవాక'మును రుద్రాధ్యాయ భాష్యావలోకన సందర్భమునఁ గల్గిన భక్త్యావేశమున వ్రాసియుంటిని. ఇయ్యది నమకమునకు భావానుకరణము మాత్రమే. ఈ పద్యములను వ్రాసికొని నేను లోలోపల బాడుకొని పొందిన యానందము చెప్పఁ దరముగానిది. ఇతరులకుఁ బండితులకుఁ గవులకుఁ బలువురకు వినిపించియు వారి నానందింపఁజేయఁ గలిగితిని. ఇట్టి పలువుర ప్రోత్సాహమే యీ గ్రంథ ప్రచురణమునకు మూలము. ఈ గ్రంథమును విని యానందపడి తమ తండ్రిగారి స్మారకచిహ్నముగను, తమ తండ్రిగారిచేఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీశంభులింగేశ్వరస్వామి కర్పితముగను ప్రకటింపఁ బూనుకొన్న శ్రీ దేవభక్తుని వెంకటనారాయణగారికిని, అడిగిన వెంటనే నాయందలి వాత్సల్యాతిరేకమునఁ బీఠికను వ్రాసియిచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికిని, శ్రీనమక మంత్రమును సస్వరముగ సమకూర్చి పద్యములను ముద్దుగ ప్రింటు చేసియిచ్చిన శ్రీ జానకీరాం ప్రెస్ వారికిని నా ధన్యవాదములు.

ఇట్లు
గ్రంథకర్త

# పీఠిక

శ్రీ నమోవాకమునకు రచయిత శ్రీ మేడిచెర్ల ఆంజనేయమూర్తిగారు, ఇది శతరుద్రీయము, రుద్రాధ్యాయము. ఇది యజుర్వేదాంతర్గతమైనను ఉపనిషత్ప్రధావంతము. ఇట్టి భాగములు తెలుఁగు చేయుటలోనున్న యౌచిత్యము విచారణీయము.

ఒక కథానకముకలదు. పిండిప్రోలు లక్ష్మణ కవిగారు రాఁబోలు భగవద్గీత తెలుఁగుసేయఁ బోయినారట, ఒకనాఁడు ఒకపండితుఁడు నిండు గోదావరి యీదివచ్చి యాయన యింటనతిథియై విస్తరిముందు కూర్చుని ఆయాపోశనము స్వీకరించలేదట. మీరు నాకొక వరమిచ్చినచో నేను భుజింతుననెను. కవికి వరమిచ్చెను. ఇచ్చి మీ యభిలాషము చెప్పుఁడనెను. పండితుఁడు ( స్వామీ మీరు భగవద్గీత తెనుఁగుసేయుచున్నారట, అది చేయవలదు. ) అని. కవి యంగీకరించెను. ఎందుకుచేయరాదు? చేసిన తప్పేమి? వందప్రశ్నలు పుట్టవచ్చును. వేయి సమాధానములు చెప్పవచ్చును.

మంత్రములు మఱియొక భాషలోనికి మార్చినచో తద్గతమైన సామాన్యార్థము వచ్చును. మంత్రశక్తిరాదు. మాతృకమైన మంత్రాక్షరముల యందు, తదక్షర విన్యాసమందు దాని గుంఫనయందు మంత్రద్రష్టయొక్క తపశ్శక్తి యిమిడియుండును. కవులయొక్క కవితయందు ఎట్లు శయ్యారీతి పాకాదులు మానసైకవేద్యములై రసజ్ఞ హృదయస్పృక్కులై యుండునో అట్లు మంత్రాక్షరములయందు మహిమ యొకఁడుండును. గుణసహితమైన లౌకికమైన కవిత మానసానందమును ఘటించినట్లు—రసానందము వేనికి వానికే అనుభూతి విషయము. ద్రవ్యాదులవలె సర్వజనులకు నేత్రగోచరము కానిది. అట్లే మంత్రగతమైన మహిమకూడ ఉపాసకునకు ననుభవ దశనందునది, చూపింపుమనినచో చూపించునదికాదు. జిజ్ఞాసువు తెలిసికొనఁ దగినది. ధూర్తుఁడు వివదింపవచ్చును. అప్రత్యక్షములన్నియు వివదింపఁ బడుచునే యున్నవి.

ఈనాఁడు వేదములే తెలుఁగు సేయఁబడుచున్నవి. అనేకులు వానిని ఇంగ్లీషు భాషలోనికే తర్జుమాచేసిరి. ఇట్లు చేయఁబడినందువలన మూల మంత్రమునకేమి నష్టమని ప్రశ్న రావచ్చును. భాషాంతరీకరణమున కేమి లాభమో ముందు తేల్చుకొనవలయునుగదా? మూలము మంత్రము, మూర్పు ( వనము, ఇంతియే భేదము. మంత్రమునను మహర్షులచేఁ జూఁడబడినది మహిమ, లోకములు విషయములు, మంత్రము తన్మహిమ లోకద్వారము. ఆ మంత్రద్రష్టయొక్క తపఃపరిణతి నాశ్రయించి యా మంత్రవర్ణోద్ధారము జరిగినది. తత్తపోలోకముల నాశ్రయించి యా మంత్రవర్గ మిశ్రితి కలిగినది. ఋషియొక్క పరిణతమైన తపశ్శక్తినుండి మంత్రము మహిమను లోకములను పొందించును. లౌకికనుులైన మంత్రము లేమిచేయును? కవి యొక్క కవితాశక్తి పద్యరూపమున వెలువడి యతని లౌకిక భావములను పెంపొందించును. ఆ లౌకికభావ మాపద్యమయము. ఆ మహిమ లోకము లా మంత్రమయములు. ఒకదానికొకటి సంబంధమేలేదు.

ఇంక నీ మంత్రముల తెలుఁగు సేతయొక్క స్వరూపమెట్టిదో పాఠకులు నిర్ణయించుకొన వచ్చును.

కాని లౌకిక కవితకు మంత్రమునకు నొక సామ్యమున్నది. అక్షర ములు, శబ్దములు, అర్థములు, ఇవి మూఁడును సామాన్యస్థితిలో సమాన లక్షణములు, ఒక భాషలోనుండి యింకొక భాషలోనికి వచ్చునవి యివి. వచ్చినది కదాయని భాషాంతరీకరణములోని వర్ణ శబ్దార్థములు ఆ భాషను తెగిన ఆ కవికి తగిన శక్తులను దెచ్చికొనకుండ మానునా?

Edurn Arnold అను కవి కాబోలు ఇంగ్లీషులో Letorature అన్న eassy లో Translation అనునది యుండదు అని వ్రాసెను. బైబిలులోని హేబ్రూభాషలోని చాలాభాగములు తర్జుమాచేయుటకే వీలులేనివి అనియే ఆయన వ్రాసెను. దీనినిగురించి యెంతయో వ్రాయవచ్చును. కాని ప్రయోజనమున్నట్లు తోచదు.

ప్రస్తుత కవి పద్యరచన చక్కనిది. ధారాశుద్ధి కలది, నిర్దుష్టమైనది. ఒకొక్కచోట మూలములోనున్న భావము చాలనిచో నీయన మఱికొంత

కలిపెను. భాష్యము దగ్గఱపెట్టుకొని అందులో చెప్పఁబడిన భావము సంగ్రహించి సంకలించెను. ఇదిచూడుఁడు.

అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సుమంగలః

ఈమంత్రభాగము నిట్లు తర్జుమాచేసెను.

ఎవరోయీ తొలిప్రొద్దునం దరుణుఁడై యీషత్కషాయాత్ముఁడై
యవల న్పింగళవర్ణుఁడై పిదప నాయా భద్రవర్ణావళిన్
దివిపై వెల్గెడు కర్మసాక్షియనఁగా నీకంటె వేఱొక్కఁడే
శివ! నీ వేడిమిసోకనీక మము రక్షింపంగదే మ్రొక్కెదన్.

ఈ చివరిభాగము మాతృకలోనిది కాదు. కల్పితమో, వ్యాఖ్యాతమో పద్యరచన చేయునప్పుడీ బాధ తప్పదు. సంస్కృత కావ్యములు తెలుఁగు సేయుటలోనే పూర్వులెందరో కష్టములు పడిరి. మంత్రమును గురించి చెప్పవలయునా ?

శతరుద్రీయము అను వాకానువాకము మహామహిమకలదిగా చెప్పఁబడినది. శ్మశానస్థులు, భస్మధారులు నిరుక్త నియమవంతులు ఒక్కొక్క యనువాకము నొక్కొక్క విధముగా లక్షలాది పురశ్చరణ సలిపి సిద్ధులు పొందుదురని ప్రమాణము. అట్టిదానికి తెలుఁగుసేత యొకవిధమైన యఋషి ప్రోక్తమైన తపస్సుకావచ్చును

లౌకికమైన కవిత దేనినో యొకదానిని అనుసరించి ప్రవర్తించునుకదా! వస్తువు దొరకవలయును. కవులందరు వస్త్వన్వేషణార్థులు. కవిత రసాశ్రయము, రసము కథాశ్రయము, పద్యరచన ఏకదేశమాత్రమైనది.

ఈ కవి చక్కని పద్యరచనాశక్తి గలవాఁడు, భవిష్యత్తులో చక్కని కవితావస్తువు లభించి తనకల్పనాశక్తికి ప్రాశస్త్యము సమకూర్చుకొనుఁగాక!

బెజవాడ
20—9—48

ఇట్లు
విశ్వనాథ సత్యనారాయణ,

# పండితాభిప్రాయము

సుకవియును నా మిత్రుండు నగు యజుర్వేదాంతర్గత రుద్రాధ్యాయమును దృష్టిలో నిడికొని శ్రీ మేడిచెర్ల ఆంజనేయ మూర్తిగారు పద్యరూపముగ రచించిన 'నమోవాకము' నామూలాగ్రముగ గ్రంథకర్త ముఖమున నే వింటిని. ఈ పద్యములు శ్రోతను భక్తిపరవశుని గావించునవిగ నున్నవి. భాష లలితమై యుదాత్తమై యలరారుచున్నది. ఈ గ్రంథమున కాంధ్ర సారస్వతములో నొక యున్నతస్థానము లభింపఁగలదని నా యభిప్రాయము.

కొవ్వూరు
5-11-47

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.
ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల.



శివాయ గురవేనమః

# నమోవాకము

శ్రీ కమనీయమై వివిధరీతుల విశ్వ జగద్గణమ్ము నం
దేకతఁ బొల్చి విష్ణు పరమేశ్వర ముఖ్య సహస్రనామముల్
జేకొని లోకము ల్వినుతిసేయ వెలింగెడు రుద్రతేజ మీ
లోకమునెల్ల శాంతిగుణ లోలముగన్వొనరించి బ్రోచుతన్.

సరసములై సహృన్నిచయసాంద్ర ముదావహ నవ్యనాట్య వి
స్ఫురితములై సుధామధుర సుందరమంధర ధీరభావనా
నిరతములై కలస్వన సునిస్తుల వృత్తములై చెలంగు వా
గ్ఝరులు మదాస్యసీమ ననిశమ్ముఁ జనించుత మిన్నుముట్టుచున్.

విద్యను విద్యానిధులను
విద్యాపూజకులఁ గవుల విద్యాపరులన్
విద్యాపోషకులను నే
హృద్యంబుగ హృదయవీధి నెంతును సతమున్.

భారద్వాద పవిత్రగోత్రజుఁడు, నాపస్తంబసూత్రుండుఁ — ప్ర
స్ఫార ద్యాజుషమంత్రపాఠకుఁడుఁ గృష్ణాతీర వాస్తవ్యుడున్
ధీరస్వాంతుఁడు మేడిచెర్ల కులుఁడు న్నిష్ఠాగరిష్ఠుండు మా
కారాధ్యుండును, దండ్రి నాగయబుధుండా విజ్ఞునిం గొల్చెదన్.

యజ్వలై శాస్త్రవేత్తలై ఖ్యాతిఁగనిన
భమిడిపాట్యన్వయులలోఁ బ్రభావఘనుఁడు
సుబ్బయార్యుఁడు తజ్జ్యేష్ఠసుత మదీయ
మాత సుబ్బాంబ భక్తిమై మదినిదలఁతు,

తండ్రి పిమ్మటఁ దండ్రియంతటి యతండ
టంచు నాతండ్రి భక్తిమై నెంచిగొలుచు
నాదు పెదతండ్రి సుబ్బయనామధేయు
నెంతయేనియు భక్తిమై నెంతు మదిని.

నాదు పెదతండ్రి నెట్లట్ల నాదు తండ్రి
యెడల భక్తినిజూపెడు లలితహృదయు
నాదు పినతండ్రి వాత్సల్య మేదురాత్ము
నర్థిమ్రొక్కెద లక్ష్మీనారాయణాఖ్యు.

శంకర విజయముఁ గూర్మముఁ
బొంకమ్ముగఁ జెప్పినట్టి పుణ్యుని, మామన్
వేంకట సుబ్రహ్మణ్య శు
భాంకుని మదినెంచెద న్సముంచితభక్తిన్.

నటకుఁడు, వక్త తార్కికుఁ డనర్గళ హాస్యవచో విశేష సం
ఘటన ధురీణుఁడు, న్మధుర గానవిశారదుఁ డాంధ్రసాహితీ
పటిముఁడుఁ గృష్ణమూర్తియన భాసిలు నా పినమేనమామ యా
పటుతర బుద్ధిశాలి గురుభావన నెంతు సతమ్ము నాత్మలో.

కొడుకుల్నల్వురు కూఁతులు న్నలువురున్ గోకొల్లయా సంతతిం
గడు నేత్రోత్సవముంబొనర్పఁగ మహానందాబ్ధి నోలాడు నా
కలతల్లేని విశుద్ధవర్తనుని మత్కాంతాపిత స్థిరునిన్
దలతున్నేఁ బసుమర్తివంశతిలకున్సత్పిచ్చయాఖ్యు న్బుధున్,

చిఱుప్రాయమ్మున విద్దెపై మలచి మచ్చిత్తమ్ము నుత్సాహ సం
భరితు న్జేయుచు నన్ను నభ్యుదయముల్భావించి దీవించి మా
దురదృష్టాన నకాల మృత్యుముఖమందుంజన్న మజ్జ్యేష్ఠ సో
దరిఁ గామేశ్వరి నెంచెద న్మతి నితాంతంబుం గృతజ్ఞుండనై.

ఆడఁడు మాటతప్పి తనయంతటియెత్తు ధనమ్ము వోసినన్
బోఁడొక మోసపుంబనికిఁ బొందఁ దత్పృత్తిని రానిదానికిన్
వీడఁడు దర్మపుంబనులు వేత్తలలో నొకవేత్త యట్టి స
చ్ఛీలు మదగ్రజు న్హృదయసీమల నెంచెద సూరయాభిధున్.

అమరకోశము నాకు నైదేండ్లప్రాయాన బోధచేసిన దయాపూర్ణుఁ బితరు
రఘువంశమునఁ గొంత, రమ్యత నేర్పిన విబుధు జొన్నలగడ్డ విశ్వనాథుఁ
బిదపఁ గావ్యత్రయ విజ్ఞానమిచ్చిన చెర్వు నారాయణు శ్రీమహితుని
భారవిన్జెప్పిన భాగవతులయజ్ఞ నారాయణాఖ్యు శాంతస్వభావు
మాఘకావ్యమ్ముఁ జెప్పిన మాన్యచరితు
నార్యుఁ జివుకుల సత్యనారాయణాఖ్యుఁ
బూర్ణ గురుభావమున భక్తిపూర్ణ మతినిఁ
బ్రస్తుతించెద గురుపరంపరను గ్రమత.

మల్లమపల్లివంశ్యు, బుధమాన్యుఁ, గవీశ్వరుఁ, బండితోత్తమున్
పుల్లమనోబ్జ ముద్రిత భవు న్గరుణామయు మల్లికార్జునా
ఖ్యోల్లసితు, న్మదీయ సుతు నుజ్వల ధీబలు వీరమల్లు నా
యుల్లమునందు నెంతు గురుతోజ్వలభక్తి సమార్చనావిధిన్.

సకలభాషా తత్వసాగర పారజ్ఞుఁ బహుముఖ విజ్ఞాన వరదువరదు
ఘనశబ్దశాస్త్ర విద్గణగణ్యు బోధనాధుర్యు రామానుజాచార్యవర్యు
తత తర్కశాస్త్ర బోధానిధి సాహితీపరు నల సోమశేఖరునిగురుని
సకలాంధ్ర సాహితీ చర్చావిచక్షణు సమధికు వేంకటరమణురమణుఁ
గవిని బండితుని విమర్శక ప్రథితుని
ధీరుని న్గురుసింహుని నారసింహుఁ
బూర్ణ గురుభావమున భక్తిపూర్ణమతినిఁ
బ్రస్తుతించెద గురుపరంపరను గ్రమత.

ఇప్పగిది నొక్కఁ నాఁ డేను నిష్టదైవ
మాతృపితృముఖ్యకులముఖ్య మాన్యతముల
పటియుఁ గన్విప్పి నన్నొక మానవునిగఁ
జేసి బ్రోచిన గురువులఁ జిత్తమలర.

తలఁచి పొగడియు మ్రొక్కి చిత్తప్రశాంతి
నున్న నాయందు జగదీశు సన్నుతించు
భక్తిభావమ్ము చెలరేగి రక్తిఁగట్టి
వివశతంగూర్చ తానుగా వెలసె నిట్లు.

పలుసభలలోన దీనిం
జిలికితి బుధులెల్ల మెచ్చి చెచ్చెర నచ్చుం
గొలుపఁగఁ బ్రోత్సాహం బిడఁ
దలకొంటిని నేను దద్విధానము నడపన్.

ఇటులుండంగ యదృచ్ఛనీవిధముఁ దా నింతంత యాలించి ము
చ్చటమై నన్పిలిపించి యీ కృతి మహోత్సాహమ్మునన్వించు ను
త్కటమౌ తృప్తిని దేవభక్తుని కులోద్ధారుండు విజ్ఞుండు వేం
కట నారాయణుఁ డాంధ్రవాఙ్మయ రసోత్కంఠుండు నా కిట్లనున్,

చదువరి భాగ్యశాలి సువిచక్షణుఁ డుజ్వల పుణ్యతీర్థ సం
విదుఁడును శంభులింగ గురువిస్తృత బోధలుగన్న విజ్ఞుఁడున్
బదిలుఁడు తేపుమాపు శివ పావన దర్శన నిష్ఠయందు న
భ్యుదయ పరంపరల్గనిన యున్నతభావుఁడు లక్ష్మయాఖ్యుఁడున్.

గోళ్లమూడి గ్రామ తల్లజమ్మున రామశాల నిర్మించిన శాంతమూర్తి
శంభులింగేశ్వరస్వామి యాలయమును బునరుద్ధరించిన పుణ్యమూర్తి
మంటప ప్రాకారసహిత కల్యాణ కృద్వితతి నిర్మించిన విబుధమూర్తి
అయ్యన్నకుం బౌత్రుఁడై పిచ్చయాఖ్యుని పుత్రుఁడై వెలసిన పుణ్యమూర్తి

న్యాయవర్తికి సత్యనారాయణునకు,
నాకు, నన్నిటఁ దనుబోలు నైష్ఠికుండు
నైన భద్రయ్యకును దండ్రి, యధికయోగ్య
సీతమకు భర్త, యాతని శీలమిట్లు

కావున నాయన పేరిట
నే వెలయించెదను వేదనిధిసుండిలన
ద్భావముల మీరు జేకొని
దేవస్తుతిఁ జేసినట్టి తీయంపు గృతి.

ముదమున నిట్లాడు లన
హృదయునిఁ యా యనఘు పూన్కిఁ దెలియుచు నేనున్
వెదుకఁబోయినఁ దీవయె
పదమునకున్ దగిలినట్లు భావించి మదిన్ .

వల్లెయటంచును నేనిటు
చెల్లించితి నాటిమాట చిత్తంబలరన్
వల్లెయటంచును వారిటు
చెల్లించిరి నాటిమాట చిత్తంబలరన్.

## షష్ఠ్యంతములు

లలిత హృదంతరున కుమా
కలితునకుం గోళ్ళమూడి గ్రామమునందుం
జలచల్లని చూపులతో
వెలసిన శ్రీ శంభులింగ విశ్వేశునకున్.

సకలాధారున కచ్యుతు
నకు శాంతిప్రదునకుం ఘనప్రభునకు భా
వుక వరదనకు స్జన క
ల్పకునకు శ్రీ శంభులింగ పరమేశునకున్.

పరమదయాళున కురగా
భరణునకు న్రాజరాజపదవాచ్యునకున్
బురుషోత్తమునకు గంగా
ధరునకు శ్రీ శంభులింగ ధామేశునకున్.

గౌరీపతికి జగద్రథ
సారథికిఁ బరేశ్వరునకు సర్వజగత్సం
సారునకును నఖిల జగ
ద్వీరునకు న్శంభులింగ విశ్వేశునకున్,

పన్నగ భూషణునకును ప
హోన్నత వృషభాధి రోహణోద్భాసునకున్
బ్రోన్నతభావమునీశ్వర
సన్నుతునకు శంభులింగ సకలేశునకున్.

భక్త మనోంబుజ పీఠీ
సక్తునకు న్భావనా వశంవదునకు వే
దోక్తిస్తుతునకును మహా
శక్తునకు న్శంభులింగ జగదీశునకున్.

వ. సభక్తి సమర్పితమ్ముగా నీ యొనర్పంబూనిన నమోవాకంబునకుఁ
బ్రారంభం బెట్టిదనిన —

శ్రీ

# నమకమ్

## ప్రథమానువాకః

హరిః ఓం

నమస్తే రుద్ర మన్యవ ఉతోత
ఇషవే నమః ।
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా
ముత తే నమః ॥ ౧

యాత ఇషుశ్శివతమా శివం
బభూవ తే ధనుః ।
శివా శరవ్యా యా తవ తయా నో
రుద్ర మృడయ ॥ ౨

---

యా తే రుద్ర శివా తనూ రఘోరాఽ
పాపకాశినీ ।
తయా నస్తనువా శంతమయా
గిరిశంతాభిచాకశీహి ॥ ౩

---

౪

శ్రీ

# నమోవాకము

## ప్రథమస్తబకము

మ. నతులోయీ, భవదీయ రోషమునకు,
న్ద్వత్సాయక స్వామికి,
న్నతులోయీ, భవదీయ చాపమునకు,
న్ద్వద్బాహు దండాలకు,
న్నతులో రుద్ర! భవద్ధనుర్విశిఖతూ
ణమ్ము ల్యుభమ్ముల్గదే,
నత మున్దత్త్రితయమ్మునన్నముల స
త్సౌఖ్యాత్ముల న్జేయవే. ౧

శా॥ ఏదోయీ, యభయంకరమ్ము జనతా
హింసా విదూరమ్ము నీ
దేదోయీ, శుభమైనరూప, మది, నే
నీక్షింప వాంఛింతు నా
కోదేవా ! గిరిశా ! ప్రసాదనిధియై
యున్నట్టి త్వద్దేహ మే
దేదీ చూపుము చూపు మెల్లపుడు స్వా
మీ ! రుద్ర ! భద్రాత్మకా ! ౨

యామిషుం గిరిశంత హస్తే
బిభర్ష్యస్తవే।
శివాం గిరిత్ర తాం కురు మాహిగుం సీః
పురుషం జగత్ ॥ ౪

శివేన వచసా త్వా గిరిశాచ్ఛా
వదామసి।
యథా నస్సర్వమిజ్జగదయక్ష్మగుం
సుమనా అసత్ ॥ ౫

మ. శయనింతోయి, గిరీంద్రమందు జగము
న్నాఖ్యాలఁ దేలింతు వ
ప్రియుల న్నాశముసేయ నీకరమున
న్వెల్గొందు సద్బాణము
న్దయతో మాయెడ శాంతినుండునటుల
న్సల్పన్గదే రుద్ర! య
త్ర్యయము న్గూర్పకు మాకు, లోకమున కీ
శా! యద్రిరాట్పాలకా. ౩

శా. ఆలింపన్గదవోయి, మామొఱ లప
ర్ణాధీశ! యీశా! దయా
శీలు న్నిన్నుఁ బ్రసన్నుఁ జేసికొని ని
స్తైరంగ భద్రమ్ములా
నాలాపాల నుతింతుమో గిరిశ! రు
ద్రా! మేము, మానేల రో
గాలన్బీదనుబొందకుండ సుమన
స్కంబౌనటుల్సేయవే. ౪

అధ్యవోచ దధివక్తా ప్రథమో
దైవ్యో భిషక్ ।

---

అహీగ్ంశ్చ సర్వాఞ్జంభయ న్త్సర్వాశ్చ
యాతుధాన్యః ॥

---

అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రు
స్సుమంగలః ।

---

శా. నీయాజ్ఞ న్గిరిగీతరీ జగతికి,
నీవేరదే యెల్లదై
తేయారాతి సభ స్సుప్రసిద్ధుఁడవు, త
ద్దేవాళికి న్నీవె కా
ధ్యేయుండైనను నేతవైన, శివ! నీ
వే కావె రోగావళి
న్మాయింప న్గల వెజ్జు, వీజగతికి
న్నన్మిన్నగాఁ దెల్పవే. ౫

కం. క్రూరం బగు హింసాక్రియ
నోరార న్జగము దిని తనూబల మెసఁగ
న్వీరమ్ముసఁ దిరిగెడు దే
వారుల, వ్యాళములఁ బట్టి వల్లార్పఁగదే. ౬

మ. ఎవరోయీ, తొలిప్రొద్దునం దరుణుఁడై
యీషత్కషాయాత్ముఁడై
యవల, న్పింగళ వర్ణుఁడై పిదప, నా
యా భద్రవర్ణావళి
న్దివిపైవెగ్గెడు కర్మసాక్షియనఁ గా
నీకంటె వేరొక్కఁడే,
శివ! నీవేడిమిసోకనీక మము ర
క్షింపన్గదే మ్రొక్కెదన్. ౭

యే చేమాగుం రుద్రా అభితో దిక్షు

శ్రితా స్సహస్రశోవై షాగుం

హేడ ఈ మహే ॥ ౭

---

అసౌ యో వసర్పతి నీలగ్రీవో

విలోహితః ।

ఉతైనం గోపా అదృశన్నదృశ

న్నుదహార్యః ॥

ఉతైనం విశ్వా భూతాని సదృష్టో

మృడయాతి నః ॥ ౧

---

౧

శా. ఏ రశ్మిప్రజమెవ్వారోయి, భువిపై
నేదిక్కున్ జూచిన
న్నీరంధ్రమ్ముగఁజుట్టి వెల్గెడిని వ
ర్ణింపంగ రాకుండఁ, ద
న్నీరేఖాప్తసమాగతమ్ము లరయ
న్నీ రూపముల్గావె, త
ద్రూపమ్మెంతని తెల్పమాతరమె, రు
ద్రా ! యెన్నిజన్మాలకున్, ౮

మ. అది నీమూర్తియకాదె, యాకసమునం
దాదిత్యనామంబుతో
నుదయం బస్తమయం బనంబడు క్రమం
బొప్పార వెల్గొందు, న
య్యది కాదే, జడచేతన ప్రతతితో
నాబాలగోపాలము
న్హృదయంబై కనిపించి బ్రోచు, గటకం
తా ! సర్వభద్రప్రియా ! ౯

నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ
మీఢుషే ।
అథో యే అస్య సత్వానో౽హం తేభ్యో౽
కరం నమః ॥ ౯

ప్రముంచ ధన్వనస్త్వముభయో
రార్త్నియో ర్జ్యాం ।
యాశ్చ తే హస్త ఇషవః పరా తా
భగవో వప ॥ ౧౦

అవతత్య ధనుస్త్వగ్ం సహస్రాక్ష
శతేషుధే ।
నిశీర్య శల్యానాం ముఖా శివో న
స్సుమనా భవ ॥ ౧౧

శా. ఏమోయీ, గళమందు మచ్చబడె, నం
దేమే విషంబంటెనా ?
యేమోయీ, నిలువెల్లఁ గన్నులఁట, యే
మేరూపు మార్పొందెనా ?
భూమింజల్లఁగఁ జేయుచుందువఁట, తే
పున్మాపు వర్షాళితో,
నేమోయీ, వరుణాత్మ ! నీకునతులో
యీ ! నీదు భృత్యాళికిన్. ౧౦

మ. విడుమీ నీవిలుత్రాడు వింటికొనల
న్విప్పెల్లఁ దూలంగ, వే
విడుమీ నీ కరమందు భీషణముగ
న్వెల్గొందు నబ్బాణము,
న్జెదఁగా దాఁపిడిపెట్టి బాణముఖము
ల్పితూణమందుంచి, మా
యెడ భద్రుండవుకమ్ము రుద్ర ! శివ ! దే
వేంద్రా ! ప్రతూణాంచితా ! ౧౧

విజ్యం ధనుః కపర్దినో విశల్యో
బాణవాగుం ఉత ।
అనేశన్నస్యేషవ ఆభురస్య
నిషంగధిః ॥ ౧౨

---

యా తే హేతిర్మీఢుష్టమ హస్తే
బభూవ తే ధనుః ।
తయాఽస్మాన్విశ్వతస్త్వమయక్ష్మయా
పరిబ్భుజ ॥

౧౩

మ. జడలన్దాల్చినమూర్తితో, మఱియు వి
జ్యంబైన చాపంబుతోఁ,
గడుముక్కల్చెడి మొక్కవోయిన శరౌ
ఘంబుల్విపర్యస్తమై
పడియుండంగ, నలంక్రియార్థముగ సం
భాషించు తూణమ్ముతో,
జడదారీ! కనిపింపఁరాదగవె, య
శ్రాంతంబు మాకండ్లకున్. ౧౨

మ. కరుణార్ద్రంబగు దృష్టి సర్వజన కాం
క్షల్దీర్చునో యీశ్వరా!
కరమున్నొకరమందు వెల్గెడు మహా
ఖడ్గాది శస్త్రాళితో,
సురశోభావిభవాకరంబగుచుఁ బె
ల్లొప్పారు చాపంబుతోఁ
బరిరక్షింపఁగ రాఁగదోయి! మము సం
భద్రమ్ములన్సర్వదా. ౧౩

నమస్తే అస్త్వాయుధాయానాతతాయ
ధృష్ణవే ।

ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం
తవ ధన్వనే ॥

శా. వింటిన్వీడిన శాంతమూర్తి, త్రుటిలో
విశ్వంబు సర్వంబుఁ దా
నొంటిన్గాల్పఁగలట్టి జెట్టి, భవదీ
యోద్దండపాణిన్దిరం
బుంటన్నేర్చినమేటి, నీశరము, మ
మ్మో రుద్ర! య్యెల్లప్పుడు
న్గంటి నెప్పఁగఁగాఁచు, దానికి నమ
స్కారంబుఁ గావించెదన్. ౧౪

మ. పదివేలోయి, నమస్కృతుల్శివ! భవ
ద్బాహు ద్వయీపీఠికి,
న్బదివేలోయి, నమస్కృతుల్శివ భవ
ద్బాణాసన స్వామికి,
న్బదివేలోయి నమస్సులీశ్వర భవ
త్పాదారుణాబ్జాలకు,
న్బదివేల్మ్రొ ప్పదివేల్నమస్సులు భవ
ద్భా స్వద్దయా బుద్ధికిన్. ౧౫

పరి తే ధన్వనో హేతి రస్మాన్వృణక్తు

విశ్వతః ।

అథో య ఇషుధిస్తవారే అస్మ

న్ని ధేహి తం ॥

---

ఇతి నమకే ప్రథమానువాక

స్సమాప్తః ॥

మ. విడుచుంగావుత నీ కరాంచిత ధను
ర్విన్యస్త బాణాస్యమె
ప్పుడు మమ్ముం, భవదీయ తీక్ష్ణశర సం
పూర్ణమ్ము తూణీరము
గ్గడు దూరమ్మగుఁగాత మాకుఁ, బరి ర
క్షా దక్ష ! నీసర్వమం
గళ దేహమ్మది మమ్ము నిత్యమును సా
క్షాత్కారమై బ్రోచుతన్. ౧౬

---

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీ నాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన ఆంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
ప్రథమస్తబకము
సమాప్తము

శ్రీ

# న మ క మ్

## ద్వితీయానువాకః

హరిః ఓం

న మో హిరణ్యబాహవే సేనాన్యే

దిశాం చ పతయే నమః ||

నమో వృక్షేభ్యో హరికేశేభ్యః

పశూనాం పతయే నమః ||

నమ స్సస్పింజరాయ త్విషీమతే

పథీనాం పతయే నమః ||

నమోబభ్లుశాయ వివ్యాధినే ఽ

న్నానాం పతయే నమః ||

శ్రీ

# నమోవాకము

## ద్వితీయ స్తబకము

మ. పసలన్మీరెడు పసిండియాభరణము
    ల్పాపహృద్వ్యయిన్దాల్చునో
యనమేశా : నతులోయినీకు, బహుసే
    నాధ్యక్ష! యోయీశ! యో
పెసలన్గాచెడు ప్రోడ! నీకివె నతు,
    ల్దేవా! నమస్కారము,
ల్పసరాహం జడలన్ధరించు ద్రుమరూ
    పా! యో పశూనాంపతీ! ౧౭

చం. అనుప రక్తపీతహృద
    యంగపు వర్ణ విశేష చిత్రిత
ప్రణుత తృణస్వరూప! జన
    పావనమార్గగణాధినాథ! ని
న్ప్రణుతి యొనర్తురా, వృషభ
    వాహన! శత్రుజనార్దనా! దయా
గుణగణనీయ! యన్నపతి!
    కూరిమి నీకు నమస్కరించెదన్. ౧౮

నమో హరికేశాయోపవీతినే
పుష్టానాం పతయే నమః ॥ ౫

నమో భవస్య హేత్యై
జగతాం పతయే నమః ॥ ౬
నమో రుద్రాయాతతావినే
క్షేత్రాణాం పతయే నమః ॥

ఉ. తుమ్మెద ఱెక్కల న్దెగడి
తోచెడి నల్లని కుంతలమ్ములం
దమ్ములఁగుల్కు, జన్నిదము
తళ్తళలాడుచు మీనుమీసమ
ట్లెమ్మను గూర్ప, శిష్ట పర
మేశ్వరమూర్తిని· బొల్చు నీదు రూ
పమ్మన కేను మ్రొక్కెదను
స్వామి ! దయాంబుధి ! చంద్రశేఖరా ! ౧౯

మ. భవబంధమ్ములకుం గృపాణమవు, స
ర్వప్రాణి లోకేశ్వరుం,
డవు, మాశోకములెల్లఁ బాపెడు దయా
న్యాయైక శీలుండవున్,
స్తవనీయంబగు చాపమెత్తి జగముల్
శాంతస్థితిం బ్రోచురా
జవు, దేహమ్ముల కెల్ల నీశుఁడ, వ నీ
శా ! మన్నమస్కారముల్. ౨౦

నమస్సూతాయాహంత్యాయ

వనానాం పతయేనమః ॥ ౬

నమో రోహితాయ స్థపతయే

వృక్షాణాం పతయే నమః॥ ౭

ఉ. సారథివై జగద్రథముఁ
జక్కఁగఁ దోలెద, వెందు నెప్పుడే
నేరికరంబున న్విడ, వ
హీనవనస్పతి పుంజవాటి వి
స్తారము ముద్దుగ న్బెనిచి
పాలన సేసెడు తోటమాలి ! వీ
నేరిమినే నుతింపఁ గల
నే కలనైన ? నమస్కరించెదన్. ౨౧

మ. తరుణాంబో నరుణారుణ ద్యుతి దిగం
తమ్ముందునందాకఁ బ్రి
స్ఫురియింపన్వెలిగించి, యన్నిమొదల
స్వర్ణాకృతిన్దోచుచు,
స్ఫురణన్సర్వజగమ్ము తేలెదవు, వృ
క్ష స్వామి ! నిన్నెప్పుడే
మెఱుఁగన్జాలుదురా ! నతుల్వినుతురా
ఈశా ! జగద్రక్షకా ! ౨౨

నమో మంత్రిణే వాణిజాయ
కక్షాణాం పతయే నమః ॥ ౧౦

నమో భువంతయే వారివస్కృతా
యౌషధీనాం పతయే నమః ॥ ౧౧

ఉ. రాజసభన్సుమంత్రి యన
రాజిలి వర్తకలోకనాయక
వ్యాజముతోడ, నాపణము
నందు వసించి, నికుంజవల్లరీ
రాజిని బ్రోచుపొంబె వన
రాజని నిల్చెద,వౌర ! నీదు న
వ్యాజ కృపాగుణమ్మునకు
హద్దొకఁ డున్నదె ? చంద్రశేఖరా ! ౨౩

చం. సకలజగద్గణమ్ములకు
స్రష్టవు, సర్వధనాఢ్యవస్తు జా
తికి గణుతింపఁ గర్తవు, మృ
తిం గెలిపించెడి యోషధి ప్రభా
ప్రకరముపాలిదేవుఁడవు,
పాపసగణ్యగుణైకభూష ! నీ
ప్రకటమహత్వపద్ధతి య
పారమురా, గనఁ జంద్రశేఖరా ! ౨౪

నమ॑ ఉ॒చ్చైర్ఘో॑షాయ

---

ఆ॒క్రం॒దయ॑తే ।

ప॒త్తీనాం॒ ప॑తయే॒ న॑మః ॥ ౧౩

---

చం. కుధరములెల్లఁ గ్రక్కదలఁ,
గ్రుంగధరాతలమెల్ల, గ్రోయు త
ప్ర థగజసైంధవాదిపరి
రబ్ధ మహత్తరవైరివాహినీ
పధనసముత్థితోచ్ఛలద
మానుష భీషణఘోషణార్భటుల్,
విధివగు నీ విలాసగుణ
లీలలటంచు నమస్కరించెదన్, ౨౫

ఉ. బాణకృపాణపాణులయి,
పాయకశత్రుల సైన్య సంహతుల్
ఘూనఘముద్దెసల్మెఱచి
ఘోరనయార్చుచుఁ బారునట్టు ల
క్షీణ పరాక్రమమ్ములొలి
కించెడి వీరుల వీరమెల్ల, నీ
పూనిక లేకదక్కునె ? య
మోఘ పరాక్రమ ! చంద్రశేఖరా ! ౨౬

నమః కృత్స్న వీతాయ ధావతే

సత్వానాం పతయే నమః॥ ౧౩

ఇతి నమకే

ద్వితీయానువాక

స్సమాప్తః॥

మ. అరపంబు, న్ద్విరదంబు, నశ్వమును తే
కవ్యాహతి న్విశ్వముల్
స్థిరలీల న్గెలుపంగఁ జాలెడు పదా
తీ ! నీకివేరా నతు,
ల్కాలకంఠా ! కవచావృతాంగ ! యరిచ
క్రక్షోభకారీ ! శివా !
శరణన్న న్భగవారిఁ గాచెడి దయా
సాంద్రా ! నమస్కారముల్. ౨౮

---

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీ నాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన ఆంజనేయ
మూర్తి చేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
ద్వితీయస్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

తృతీయానువాకః

హరిః ఓం

నమ స్సహమానాయ నివ్యాధిన
ఆవ్యాధినీనాం పతయే నమః ॥

---

నమః కకుభాయ నిషంగిణే
స్తేనానాం పతయేనమః ॥

---

శ్రీ

# నమోవాకము

## తృతీయ స్తబకము

చం. ఎవఁడు జగద్విరోధుల స
హింపక, నిచ్చలు వారి వెంబడి
న్దవిలి పరాభవించునో, స
దా, ప్రసర త్స్వకలాయుధాళితో
నెవఁడు విరోధుల న్దునుము,
నెవ్వఁడు శత్రుగజేంద్రమారణ
ప్రవణజనేశుఁ డాప్రభుని,
భద్రుని నిన్గొలుతు న్మహేశ్వరా ! ౨౮

చం. జగములకెల్ల ముఖ్యుఁడను
నద్యశమందుట, శస్త్రపాణివై
యగణిత శౌర్యరాశి యను
నట్టి యశమ్మును గొంట, మేలె యా
పెగటుఁదనంపుఁ దెక్కెలులు
వెంటఁజరింపఁగఁ, జోరరాజవై,
జగములదోఁతువేమి యిది ?
సర్వజగత్ప్రభు ! చంద్రశేఖరా ! ౨౯

నమో నిషంగిణ ఇషుధిమతే

తస్కరాణాం పతయే నమః ।

ఉ. నారిబిగించి వింటను, ఘ
నంబుగ టంకృతి సల్పి, వాడియౌ
నారస, మందుఁ బూన్పుటకు
నై, కర మల్లనఁ దూణదేశమున్
జేరుచు, నీదుశౌర్యగుణ
చిహ్నితమూర్తికిఁ, బాణియుగ్మమున్
జేరిచి మ్రొక్కెదన్, విబుధ
సేవిత ! శంకర ! చంద్రశేఖరా ! ౩౦

ఉ. పట్టపగల్ విచిత్రగతిఁ
బట్టణసీమలఁ జొచ్చి, యిండ్లలో
గుట్టులు పట్టులున్నెఱికి,
కోటులు కోట్లు ధనమ్ము లల్లఁ జే
పట్టి, యదేమియన్న నరు
ప్రాణముతీసెడి చోరవర్గము,
న్నెట్టన నేలుదంటవట,
నిన్ను మతేమనఁ జంద్రశేఖరా ! ౩౧

నమో వంచతే పరివంచతే

స్తాయూనాం పతయే నమః ||

మ. ఒకశ్రీమంతునియొద్ద నాప్తునటు లెం
తో నమ్మిక న్జేరి, త
త్సకలార్థ క్రయవిక్రయాదులను స్వే
చ్ఛ న్మించి సాధించి, పా
యక తత్తత్క్రియలందు నందిన ధనం
బవ్యాహతి న్బొందు వం
చకుఁడైన, న్భవదాజ్ఞలేని జనుఁడే, :
స్వామీ ! జగన్నాయకా ? ౩౨

చం. అనిశము నాప్తునట్లు ధని
కావళియొద్దను జేరి, వీలుమై
ఘనధనధాన్య సంపదల
గైకొను తెక్కలిపిందుకెల్ల, నీ
కనికరమో, సుమంత్రణమొ
గల్గక యంతటిశక్తి గల్గునే ?
యనుదినముం భవత్పదము
లంటి నమింతును, జంద్రశేఖరా ! ౩౩

నమో నిచేరవే పరిచరాయా

అరణ్యానాం పతయే నమః ॥ ౫

చం. ధనికులపజ్జ భృత్యునివి
ధంబున నిల్చి, తదీయవస్తువా
హనతతి దొంగిలించు మతి
నారయు నీకు నమస్సు, నిత్య మా
పణములఁ జోరరూపమున,
వర్తకముఖ్యుల ధాన్యసంపదల్,
గొనఁబరికించు నీకుఁ,గడుఁ
గూర్మి నమస్సొనరింతు నీశ్వరా। ౩౪

శా. స్ఫీతారణ్యపథానఁ బాంధజనముం
బీడించి, తత్సర్వము,
న్నీతిస్వీడుచు దోచుచోరతతికి
న్నీయందయో, దండయో
ఖ్యాతింపం బడఁబోలు నీ మహిమలూ
హాతీతముల్శంకరా।
చేతుల్మోడిచి నీకు మ్రొక్కెదను, ని
స్సీమప్రభావాంచితా। ౩౫

నమస్సృకావిభ్యో జిఘాగ్ంసద్భ్యో

ముష్ణతాం పతయే నమః ॥ ౬

నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః

ప్రకృంతానాం పతయే నమః ॥ ౭

---

చం. కరమున వజ్రమూని, తన
కాయముఁ గాచుకొనంగఁ జూచు నో
యరసిక వేషధారి ! జన
హంతృవపుర్వ్యాజ ధారి ! యోహరీ !
కరములుమోడ్చి మ్రొక్కెదను.
గళ్లమునం గల ధాన్యవర్గ మ
బ్బురముగఁ దోచు దొంగల స
మూహము పాలిటి నాయకోత్తమా ! ౩౬

ఉ. చౌర్యముపొందె, ఖడ్గ మని
శమ్మును బాణిని బూనియుండు దు
ష్టౌర్య విశిష్ట చోరుఁడన.
రాత్రులఁ బ్రాణుల బాధవెట్టి దు
శ్చర్య లొనర్చు చోరులన,
సర్వజగజ్జన మారణక్రియా
ధుర్యులపాలిరాజువన,
ధూర్జటి ! నీవయటంచు మ్రొక్కెదన్. ౩౭

నమ ఉష్ణీషిణే

గిరిచరాయ

కులుంచానాం పతయే నమః॥ ౮

చం. శిరమునఁ జాగఁ జుట్టి, మృదు
చేలముల న్నెఱనీటుగాఁగ పై
నఱయిక దిద్ది, మీసముల
నట్టిటు కోరలువారఁ ద్రిప్పి, నా
గరకునిమాడ్కిఁ, బల్లియల,
గంద్రతెలుంగనివారి వంచనన్
బఱపెడి చోరరూపు, నిను,
బల్మఱు మ్రొక్కెదఁ జంద్రశేఖరా! ౩౮

ఉ. కొండలయందుఁ గట్టియలఁ
గొట్టుకొనం దిరుగాడువారి సు
ద్దండత నాక్రమించి పరి
ధానము లూడ్చెడి చోరులన్న, ఘూ
ఖండము, లిండు, లాక్రమణ
గాఁ గొనుచోరులనేత యన్న, నీ
గండుతనంపు మూర్తులని,
గాఢపు భక్తి, నమస్కరింతురా! ౩౯

నమ ఇషుమద్భ్యో

ధన్వావిభ్యశ్చ వో నమః॥

నమ ఆతన్వానేభ్యః

ప్రతిదధానేభ్యశ్చ వో నమః॥ ౧౦

నమ ఆయచ్ఛద్భ్యో

విసృజద్భ్యశ్చ వో నమః॥ ౧౧

నమోఽస్యద్భ్యో

విధ్యద్భ్యశ్చ వో నమః॥ ౧౨

ఉ. బాణము సంధరియించు నీకివె నతు,
ల్బాణాసనమ్ము ల్సదా
పాణింబూనెడు నీకివే నతులు, చా
పమ్మెక్కిడఁగ్గోరు నీ
కే సంధానెడు భక్తిమ్రొక్కెద, శర
మ్మేయంగఁ జాపాసనం
బానమ్ముం బొసరించు నీకు నతి, రు
ద్రా ! సర్వలోకేశ్వరా ! ౪౦

శా. బాణాకర్షణఁ జేయు నీకివె నతుల్,
బాణప్రయోగక్రియా
నూనప్రజ్ఞుఁడవైన నీకునతు, ల
య్యుగ్రంపు బాణమ్ము ల
క్ష్యాసంయోజన నేయు నీకు నతి ల
క్ష్యమ్ము న్వ్యథమ్మంచు నీ
కోనిస్సీమ దయాభిషంగ ! నతు లె
న్నో చేసెద, న్శంకరా ! ౪౧

నమ ఆసీనేభ్య

శ్శయానేభ్య శ్చ వో నమః॥ ౧౩

నమ స్స్వపద్భ్య

జాగ్రద్భ్యశ్చ వో నమః॥ ౧౪

నమస్తిష్ఠద్భ్య

ధావద్భ్యశ్చ వో నమః॥ ౧౫

నమస్సభాభ్య

స్సభాపతిభ్యశ్చ వో నమః॥ ౧౬

నమో అశ్వేభ్యో

శ్వపతిభ్యశ్చ వో నమః॥ ౧౭

ఇతి నమకే
తృతీయానువాక
స్సమాప్తః॥

శా॥ ఆసీనాత్ము, శయానరూపుఁ దత ని
ద్రానంద మగ్నాత్ము, ను
ల్లాస ప్రాకృత జాగ్రదాత్ముని బదా
లంబు, న్ద్వారా ధావకున్
శ్రీసంపన్ను, సభాస్థితాత్ముని, సభా
శ్రీనాథు, నశ్వాత్ము, న
శ్వా సంఖ్యాకగణప్రభు,న్నిను నమో
వాకమ్ముల న్గొల్చెదన్. ౪౨

---

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీనాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తి చేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
దృతీయ స్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

## చతుర్థానువాకః

హరిః ఓం

నమః ఆవ్యాధినీభ్యో
వివిధ్యన్తీభ్యశ్చ వో నమః ౧

నమ ఉగణాభ్య
స్తృగుంహతీభ్యశ్చ వో నమః ౨

నమో గృత్సేభ్యో
గృత్సపతిభ్యశ్చ వో నమః ౩

శ్రీ

# నమోవాకము

## చతుర్థస్తబకము

మ. మొగుతుఙ్జేతు, లశాంతి కారణములై,
భూతాకృతుల్దాల్చి మా
జగమెల్లప్పుడుఁ, బీడమించెడి భవ
చ్ఛక్తిస్వరూపాలకు,
న్మొగుతుఙ్జేతు, లనేకరీతుల మహా
భూతాకృతుల్దాల్చి, మా
జగమున్సర్వముఁ, బీడమించెడి భవ
చ్ఛక్తిస్వరూపాలకున్. ౪౩

మ. నతులోయీశ్వర! సప్తమాతృకలకు,
న్ద్వచ్ఛక్తిరూపాలకు
న్నతి దుర్గాది గణాంతరస్థములకు,
న్ద్వచ్ఛక్తిరూపాలకు
న్నతులోయీ! విషయప్రసక్తి బహుళాం
ధప్రాణి వర్గాలకు,
న్నతి తత్తద్విషయప్రసక్త జన బృం
దస్వామి వర్గాలకున్. ౪౪

నమో వ్రాతేభ్యో

వ్రాతపతిభ్యశ్చ వో నమః ౪

నమో గణేభ్యో

గణపతిభ్యశ్చ వో నమః ౫

నమో విరూపేభ్యో

విశ్వరూపేభ్యశ్చ వో నమః ౬

నమో మహద్భ్యః

క్షుల్లకేభ్యశ్చ వో నమః ౭

నమో రథిభ్యో

రథేభ్యశ్చ వో నమః ౮

నమో రథేభ్యో

రథపతిభ్యశ్చ వో నమః ౯

మ. నతి నానావిధ జాతిసంఘములకు,
స్ద ద్భర్తృ సంఘాలకు,
న్నతిదేవానుచరస్వరూపములకు,
స్దన్నేతృవర్గాలకు,
న్నతి నగ్నాది విరూపసంఘములకు,
స్ద్వ ద్విశ్వరూపాలకు,
న్నతులైశ్వర్య సమేతమూర్తులకుఁ, ద
న్నష్ట స్వరూపాలకున్. ౪౫

మ. నతి నానా రథికప్రకాండమునకు,
స్దల్లు ప్త వర్గాలకు,
న్నతి నానారథరూపధారులకుఁ, ద
న్నాథ స్వరూపాలకు,

నమస్సేనాభ్య

స్సేనానిభ్యశ్చ వో నమః॥ ౧౦

నమః క్షత్తృభ్య

స్సంగ్రహీతృభ్యశ్చ వో నమః॥ ౧౧

నమస్తక్షభ్యో

రథకారేభ్యశ్చ వో నమః॥ ౧౨

నమః కులాలేభ్యః

కర్మారేభ్యశ్చ వో నమః॥ ౧౩

నమః పుంజిష్టేభ్యో

నిషాదేభ్యశ్చ వో నమః ౧౪

న్నతి సేనాళికి, సైన్యనాథులకు, మా
నప్రత్వము. ల్యంకరా !
నతి నీనీరథ శిక్షకాకృతులకు,
న్ద త్స్యూతయూపాలకున్. ౪౬

సీ. వందనమ్ములు. శిల్పివరరూపధరులార !
వరరథకరులార ! వందనములు
వందనాలు, కులాలవంశసంభవులార !
వరలోహ కరులార ! వందనములు
వందనమ్ములు, పక్షివర్గఘాతుకులార !
వనచరాంతకులార ; వందనములు

నమ ఇషు కృద్భ్య
ధన్వకృద్భ్యశ్చ వో నమః॥ ౧౫

నమో మృగయుభ్య
శ్వనిభ్యశ్చ వో నమః॥ ౧౬

నమ శ్వభ్య
శ్వపతిభ్యశ్చ వో నమః॥ ౧౭

ఇతి నమకే
చతుర్థానువాక
స్సమాప్తః

వంచనమ్ముల, శరవర్గకారకులార !
వరధనుష్కారులార ! వందనములు

తే. గీ. వ్యాధకుల సముద్భవులార ? వందనములు
శ్వానరక్షణపరులార ! వందనములు
శ్వానసుశరీరధరులార ! వందనములు
వంచనాల్మికు శివులార ! వందనములు. ౪౩

---

ఇదిమేడిచెర్ల కులాలంకారుండగు శ్రీనాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
జతుర్థస్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

## పంచమోనువాకః

హరిః ఓం

నమో భవాయచ రుద్రాయచ॥ ౧

నమ శ్శర్వాయచ పశుపతయేచ॥ ౨

---

నమో నీలగ్రీవాయచ శితికంఠాయచ॥ ౩

నమః కపర్దినేచ వ్యుప్తకేశాయచ॥ ౪

# నమోవాకము

## పంచమస్తబకము

మ. ఎవఁడీ లోకముల న్సృజించు భవుఁడో,
యెవ్వండు మాళోముల్
ద్రవియింపించెడి రుద్రుఁడో, యెవఁడు ఘో
రాలైన పాపాలనే
నిపురంజేయఁగలట్టి శర్వుఁడొ, యెవం
డీ జ్ఞానశూన్యప్రజా
నివహంబేదునొ, యట్టియోపశుపతీ !
నీకున్నమస్కారముల్. ౪౧

చం. గళము సగమ్ముగ న్విషము
గల్గినయోగరకంఠమూర్తి ! త
ద్గళము సగమ్ముగన్మతిమ
గల్గిన యోశితికంఠమూర్తి ! యో
లలితజటావిలాసగుణ
లాంఛిత ! యోయికపర్ది ! నీకిదే
పొలుపుగఁ గేలుమోడ్చెదను,
ముండితకేశయతిస్వరూపుఁడా ! ౪౨

నమస్సహస్రాక్షాయచ శతధన్వనేచ ౫

నమో గిరిశాయచ శిపివిష్టాయచ ౬

నమో మీఢుష్టమాయ చేషుమతేచ॥ ౭

నమో హ్రస్వాయచ వామనాయచ॥ ౮

నమో బృహతేచ వర్షీయసేచ॥ ౯

నమో వృద్ధాయచ సంవృధ్వనేచ॥ ౧౦

నమో అగ్రియాయచ ప్రథమాయచ॥ ౧౧

మ, ఒకచోఁ గన్నులు వేయిటన్నిలుతొ ? వే
రొక్కంట వేబాహుల
న్ప్రకటింతో ? యొకమారు పర్వతముపై
భాసింతొ ! యొందొక్కటన్
సకలంబందు వసింతొ ? యొక్కయెడఁ బ
ర్జన్యాకృతి న్దాల్తువో ?
సకలేశా ! యిషుహస్త నీకిదె నమ
స్కారమ్ము గావించెదన్, ౫౦

మ, ఒకటన్సుజ్ఞు, మఱొక్కచోటమఱిగు
జ్ఞొందొక్కచో దొడ్డవై,
యొకట న్సద్గుణపూర్ణబుద్ధివయి, వే
రొండొక్కచో వృద్ధువై
యొకటన్సంస్తవనీయ కీర్తివవుదో ?
యోయీ ! జగత్పూర్వ ! యో
సకలాదిత్యసభాధినాథుఁడ ! నమ
స్కారమ్ము నీకీశ్వరా ! ౫౧

నమ ఆశవేచా జిరాయచ॥ ౧౨

నమ శ్శీఘ్రియాయచ శీభ్యాయచ ౧౩

నమ ఊర్మ్యాయచా వస్వన్యాయచ॥ ౧౪

నమ స్రోతస్యాయచ ద్వీప్యాయచ ౧౫

---

ఇతి పంచమోనువాక

స్సమాప్తః॥

శా. ఆశువ్యాపనశీలము, న్గమన స
మ్యక్కౌశలంబు, న్దవారా
వేశా న్గమనంబు సల్పుగుణము,
న్విశ్వప్రవాహాకృతి
న్దేశాల న్దరియించునేర్పుఁ, దలప
న్నీసొమ్మురా. రుద్ర ! యో
యీశా ! మా నతులందుకోఁగదర ! స్వా
మీ ! సర్వకాలంబులన్, ౫౨

మ. చిఱుగాడ్పుల్గదలింప, మింటిమొగమై
చెన్నారు నీరంపుఁ బై
తఱగ ల్నీదు విలాసముల్గదవె? శాఁ
తమ్మైన నీరమ్ముపై
మెఱయున్గాదె భవద్విలాసము ? ఝరీ
మిత్రాకృతీ ! ద్వీప సు
స్థిరరూపా ! నతులోయి ! నీనిఖిల మూ
ర్తిస్ఫూర్తి రత్నాలకున్. ౫౩

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీనాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తి చేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
పంచమస్తబకము
సమాప్తము

శ్రీ

# న మ క మ్

షష్ఠోఽనువాకః

హరిః ఓం

నమో జ్యేష్ఠాయచ కనిష్ఠాయచ॥ ౧

నమః పూర్వజాయ చాపరజాయ చ॥ ౨

నమో మధ్యమాయ చాపగల్భాయచ॥ ౩

(శ్రీ)

# నమోవాకము

## షష్ఠ స్తబకము

మ. చదువు ల్సంపదలు న్మొదల్గలుగు నై
శ్వర్యంబులం బెద్దవై,
యెదియు న్లేని దరిద్రమూర్తివియునై,
యీరేడు లోకాలకు
న్మొదటన్వెల్గిన ధాతవై ప్రళయమం
దుం గాలరుద్రుండవై,
మొదలంట న్సకలమ్ము ద్రుల్చు శివ! కే
ల్మోడ్తు న్భవల్లీలకున్. ౨౪

మ. జగదుత్పత్తికిఁ బిమ్మట న్ప్రళయ దీ
క్షా కేళికిం బూర్వ, మీ
జగమందుంగల జీవసంఘములు, త్వ
త్సంబంధ లీలల్గదే,
జగజెట్టీ! యెవరోయి తొట్టియల ర
క్షల్పొందు నబ్బాలకుల్,
మొగమోటంపడకుండఁ దెల్పఁగదె! కే
ల్మోడ్తు న్భవల్లీలకున్. ౨౨

నమో జఘన్యాయ చ బుధ్నియాయ చ॥ ౪

నమ స్సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ॥ ౫

నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ ౬

నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ॥ ౭

నమ శ్లోక్యాయ చావసాన్యాయ చ॥ ౮

నమో వన్యాయ చ కక్ష్యాయ చ॥ ౯

నమ శ్శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ॥ ౧౦

నమ ఆశుషేణాయ చాశురథాయ చ॥ ౧౧

నమ శ్శూరాయ చావభిందతే చ॥ ౧౨

నమో వర్మిణేచ వరూధినే చ॥ ౧౩

నమో బిల్మినే చ కవచినే చ॥ ౧౪

నమ శ్శ్రుతాయ చ శ్రుతసేనాయ చ॥ ౧౫

---

ఇతి షష్ఠోనువాక

స్సమాప్తః

ఉ. వైదికమంత్రజాతమున
వర్తిలుమూర్తి, తదంతమంత్ర సం
పాదితమూర్తి, రమ్యవన
పాదపమూర్తి లతాఢ్యమూర్తి, శ
ష్పాదికవర్తి, యోప్రతిర
వాంఛితమూర్తి, సతమ్ము నీకు స
మ్మోదముతో నమస్కృతులు
పొల్పుగ సల్పెదనో మహేశ్వరా! ౪౮

సీ. ఎవ్వని సైన్యమ్ము వేగవేగముతోడ
నెవ్వఁడు పైరుల యేపడంచు
నెవ్వఁడు శూరుఁడై యేచుచునని నిల్చు
నెవ్వఁడు కవచియై యెసఁగుచుండు
నెవ్వఁడు కంచుకోపేతుఁడై భాసిల్లు
నెవ్వడు సూతుడై యింపుగాంచు
నెవఁడు కిరీటియై యెల్లయనులనుండు
నెవ్వఁడు కవచియై యెసఁగుచుండు

తే. గీ. నెవఁడు వేదాల ముఖ్యుఁడై యేపుగాంచు
నెవఁడు వందిగణజనేశ్వరుండు
నెవని కీశ్వరుఁడనువాడు నెవ్వఁడు లేఁడో
యట్టి యీశ్వర! వందనాలయ్యనీకు. ౪౯

ఇది పేడిచెర్ల కులాలంకారుఁడగు శ్రీ నాగేశ్వరా
ర్యుని ద్వితీయ తనూభవుండైన యాంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
షష్ఠస్తబకము —— సమాప్తము

శ్రీ

# న మ క మ్

సప్తమానువాకః

హరిః ఓం

నమో దుందుభ్యాయ చాహనన్యాయ చ॥ ౧

నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ॥ ౨

నమో దూతాయ చ ప్రహితాయ చ॥ ౩

నమో నిషంగిణే చేషుధిమతే చ॥ ౪

శ్రీ

# నమోవాకము

## సప్తమ స్తబకము

శా. నాపంచ్పై వినిపింతు మందుఖిని పం
దంబందు తద్ధ్యానన
శ్రీధర్మంబున గానుపింతు ధృతిపై
చెన్నొందవే తారల,
దే నీకళ గూఢచారుల, ధవా
నీనాథ! యిమ్మాటికి
దో యా జగమందు, నీప్రతిభతే
నేరేస, దే యుక్కటిన్. ౬౦

శా. రాజాస్థానమునందు మాతయన, గా
ర్య ప్రేషితుండన్న, నీ
యోజస్స్ఫూర్తితులేగదే ? యసిధరుం
డాప్పారదే నీ కళ,
భ్రాజిల్లంగదె నీ విలాసమున మా
ణాభ్రాజి, తత్త్వద్విధ
భ్రాజిష్ణు, న్నిను, నే నమస్కృతుల సం
భావింతునో యీశ్వరా! ౬౧

నమ స్తీక్ష్ణేషవే చాయుధినే చ॥ ౫

నమ స్స్వాయుధాయ చ సుధన్వనే చ ॥ ౬

నమ స్స్రుత్యాయచ పథ్యాయ చ॥ ౭

నమః కాట్యాయ చ నీప్యాయ చ॥ ౮

నమ స్సూద్యాయ చ సరస్యాయ చ॥ ౯

నమో నాద్యాయ చ వైశన్తాయ చ॥ ౧౦

నమః కూప్యాయ చావట్యాయ చ॥ ౧౧

నమో వర్ష్యాయ చావర్ష్యాయ చ॥ ౧౨

నమో మేఘ్యాయ చ విద్యుత్యాయ చ ౧౩

సీ. ఎవ్వాని సాయకమ్మొంతేని వాడిమై
వరలునో వానికి వందనమ్ము
లెవ్వాని కరమందు నెన్నేని బాణముల్
పరగునో యతనికి వందనమ్ము
లెవ్వాని చేతియం దెసఁగుఁ ద్రిశూలమ్ము
భద్రదం బతనికి వందనమ్ము
లెవ్వాని హస్తమం దిముడు పినాకమ్ము
సుందరం బతనికి వందనమ్ము
తే. గీ. లెవఁడు లఘుమార్గమూర్తియై యెసఁగుచుండు
నెవఁడు ఘనమార్గరూపియై యొప్పుగాంచు
నెవఁడు కృత్రిమ కుల్యాత్ముఁ డెవఁ డనంత
వాహినీరూపుఁ డతనికి వందనములు. ౬౨

సీ. కర్దమమిశ్రాంబు కణరూపుఁ డెవ్వాఁడు
వరసరోజలమూర్తి వరలు నెవఁడు
పుష్కరిణీ నీరపూరమూర్తి యెవండు
స్వల్పసరోమూర్తిఁ బరగు నెవఁడు
క్రూపప్రపూర్ణాంబు రూపుఁడౌ నెవ్వాఁడు
గర్తస్థలఘుజలమూర్తి యెవఁడు
ఘనఘనాఘన వృష్టవనరూపుఁడెవ్వాఁడు
ఘనసముద్రాంభః ప్రకాండుఁడెవఁడు
తే. గీ. ఘూరిఘనసాంద్ర విస్ఫురద్వారిమూర్తి
విద్యుదుల్లసదంబు సంవిష్టమూర్తి
యెవఁడో వానికి నర్పింతు విన్నియన్ని
యనఁగరానన్ని వందనా లధికభక్తి. ౬౩

నమ ఈధ్రియాయ చాతప్యాయ చ॥ ౧౪

నమో వాత్యాయ చ రేష్మియాయ చ॥ ౧౫

నమో వాస్తవ్యాయ చ వాస్తుపాయ చ॥ ౧౬

---

ఇతి సప్తమానువాకః

సమాప్తః

సీ. శరదభ్రభాసురజలరూప ధరునకు
సందింతు సద్భక్తి వందనమ్ము
ఆతప సహిత వృష్ట్యాకార ధరునకుఁ
జెందఁ జేసెద భక్తి వందనమ్ము
వాయుసమ్మిశ్ర వర్షాయతమూర్తిని
బొందింతు నర్మిలి వందనమ్ము
ప్రళయాబ్ధి జాగ్రత్ప్రవర్షభాభాస్వర
వరమూర్తి కర్పింతు వందనమ్ము
తే. గీ. వస్తులోక శరీరికి వందనమ్ము
వాస్తువిజ్ఞాన విభునకు వందనమ్ము
వందనము సర్వవ్యాపికి వందనమ్ము
వందనము జగత్ప్రభునకు వందనమ్ము. ౭౪

---

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీనాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
సప్తమస్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

## అష్టమోఽనువాకః

హరిః ఓం

నమ స్సోమాయ చ రుద్రాయ చ॥ ౧

నమ స్తామ్రాయ చారుణాయ చ॥ ౨

నమ శ్శఙ్గాయ చ పశుపతయే చ॥ 3

నమ ఉగ్రాయ చ భీమాయ చ॥ ౪

నమో అగ్రేవధాయ చ దూరేవధాయ చ॥ ౫

నమో హన్త్రే చ హనీయసే చ॥ ౬

౮ శ్రీ ౮

# నమోవాకము

## అష్టమస్తబకము

మ. ఉమనర్ధాంగిగనేలు సోమునకు, నెం
తో ప్రీతిమై మాదు శో
కములెల్లం గరిగింపు రుద్రున, కుషః
కాలంబున న్దా ప్రబిం
బమున న్దో చెదియార్యమాత్మునకు, సా
మాన్యారుణజ్యోతి రూ
పముతోఁ బిమ్మట వెల్గు నీశునకు, మ
ద్భావమ్మున న్మ్రొక్కెదన్. [illegible]

మ. తత సౌఖ్యప్రదదుఁడైన శంగునిఁ, బశు
త్రాత, న్విరోధ్యుత్పత
త్తతరోషాకృతి, భీమమూర్తి. నెదురై
దర్పాత్ములన్దాన శి
క్షితులన్జేసెడువానిఁ, గన్మొరఁగి శి
క్షింపన్జాలు నవ్వావి దు
ర్మతి సంహర్త్తను. హంతకాకృతుని నం
భావింతు నస్మన్మతిన్, [illegible]

నమకమ్

నమో వృక్షేభ్యో హరికేశేభ్యః॥ ౭

నమస్తారాయ॥ ౮

నమశ్శంభవే చ మయోభవే చ॥ ౯

నమశ్శంకరాయ చ మయస్కరాయ చ॥ ౧౦

ఉ. పచ్చనియాకులన్గుములు
వారుచు నేచిన వృక్షసంతు, నీ
యచ్చపు రూపులేగదవె ?
యట్టి ఘనన్మధుమూర్తికిన్నతుల్.
నిశ్చలమై ధ్వనించుచు, న
నేక మృదుధ్వని రాజికాద్యమై,
ముచ్చటఁగొల్పు నీ ప్రణవ
మూర్తికిఁ జేసెద నెన్నియోనతుల్. ౬౦

చం. ఘన ధన ధాన్య ముఖ్య సుఖ
కారణుఁడెవ్వఁడు, మోక్షలక్ష్మినిం
జనితము సేయునెవ్వఁడు, ప్ర
సన్న పితృప్రముఖాత్ముఁడై సుఖ
మ్మును నిడు నెవ్వఁ డేఁడుగురు
మూర్తిని మోక్షసుఖమ్మునిచ్చు, నా
ఘనునకు నంజలించెద, జ
గన్నుత మంగళశాంతమూర్తికిన్, ౬౧

నమశ్శివాయ చ శివతరాయ చ॥ ౧౧

నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ॥ ౧౨

నమః పార్యాయ చావార్యాయ చ॥ ౧౩

నమః ప్రతరణాయ చోత్తరణాయ చ॥ ౧౪

నమ ఆతార్యాయ చాలాద్యాయ చ॥ ౧౫

నమశ్శష్ప్యాయ చ ఫేన్యాయ చ॥ ౧౬

నమస్సికత్యాయ చ ప్రవాహ్యాయ చ॥ ౧౭

---

ఇత్యష్టమోఽనువాక

స్సమాప్తః.

ఉ. మంగళరూపధారికి నమస్సు, సు
మంగళశాలికిన్నతు,
ల్మంగళ తీర్థవాసికి న
మస్సు, నదీతటవాసికిన్నతుల్,
తుంగభవాబ్ధి తీరయుగ
తుందిలమూర్తికి మన్ననమస్కృతుల్,
సంగవిముక్తి హేతునకు,
సర్వవిమోచనశాలికి, న్నతుల్ ౧౯

మ. భవవార్ధింబడి మ్రగ్గువాఁడనఁగ, సం
పన్ముఖ్య సౌఖ్యావళి
న్మివులన్గోరెడు వాఁడనంగ, సరయ
న్నీవేకదే దేవ! యీ
భువిలోనన్ ద్రుణమైన ఫేనమయిన,
న్భూరేణువైన న్జలో
ద్భవమైన, న్నినుకంటెభిన్నమటె? త
త్త్వద్రూప! నీకున్నతుల్. ౨౦

---

ఇది పేడిచెర్ల కులాలంకారుండగు శ్రీ నాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
అష్టమస్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

## నవమానువాకః

హరిః ఓమ్

నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ॥ ౧

నమః కింశిలాయ చ క్షయణాయ చ॥ ౨

నమః కపర్దినే చ పులస్తయే చ॥ ౩

నమో గోష్ఠ్యాయ చ గృహ్యాయ చ॥ ౪

నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ॥ ౫

శ్రీ

# నమోవాకము

## నవమ స్తబకము

ఉ. మానవిహీన దేశము, వి
కస్వర సస్యసమృద్ధదేశము,
గ్గానట పీనమై వివిధ
కర్కశశైలములున్న దేశము,
న్యాసముచేయ నిత్యమయి
భాసిలువారి సమృద్ధదేశము,
న్యాసలు నీవిలాస గుణ
భాసములంచు, నమస్కరించెదన్. ౭౧

చం. ఉడలు ధరింతువంట ముని
సంతతికిం గనిపింతువంట, గో
కులమున నుందువంట, గృహ
కోటులఁ బుట్టుచు నుందువంట, బల్
వెలయుదువంట తల్పముల,
వెల్గెదవంట సుసాధపాళిఁ ని
న్నెడ తెలియంగ మాతరము
నంగనువాదుగదా, మహేశ్వరా! ౭౨

నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ॥ ౬

నమో హ్రదయ్యాయ చ నివేష్ప్యాయ చ ౭

నమః పాగుం సవ్యాయ చ రజస్యాయ చ॥ ౮

నమ శ్శుష్క్యాయ చ హరిత్యాయ చ॥ ౯

నమో లోప్యాయ చోలప్యాయ చ॥ ౧౦

---

నమ ఊర్వ్యాయ చ సూర్మ్యాయ చ॥ ౧౧

నమః పర్ణ్యాయ చ పర్ణశద్యాయ చ॥ ౧౨

మ. వనము ల్గహ్వరసీమలు స్మృదుగులుం,
ప్రాలేయవాః పూరము,
ల్తనుపాంసువ్రజము,
ల్పరాగగణము ల్ప ల్యుష్కకాష్ఠమ్ములన్,
ఘనకాంత్యుజ్జ్వలకాష్ఠము,
ల్కఠిన భూఖండమ్ములు, న్నారభూ
గణము, ల్కి నివసించుచోట్లుగదె, యు
గ్రా! రఖ! సర్వేశ్వరా! ౨౩

ఉ. భూతలసీమలు, న్నిషిర
ధామములు, భూజమనోజ్ఞపత్రముల్
వాతవిధూతశుష్కతరు
పత్రములు న్భవదద్భుతావహ
స్ఫీతవిలాసచిహ్నములు,
చెప్పెడిదేమి మహేశ! నీవుగాఁ
జేతమునందుఁ దోచని య
చేతనచేతన వర్గమున్నదే? ౨౪

నమో అపగురమాణాయ చాభిఘ్నతే చ॥ ౧౩

నమ ఆక్ష్ణిదతే చ ప్రక్ష్ణిదతే చ॥ ౧౪

నమో వః కిరికేభ్యో

దేవానాగుం హృదయేభ్యః॥ ౧౫

నమో విక్షీణకేభ్యః॥ ౧౬

నమో విచిన్వత్కేభ్యః॥ ౧౭

నమ ఆనిర్హతేభ్యః॥ ౧౮

నమ ఆమీవత్కేభ్యః॥ ౧౯

ఇతి నవమోనువాక

స్సమాప్తః

ఉ. ఆయుధమెత్తి, క్రూరుల భ
యార్తులగం బొనరింప రోషివై,
యాయుధమెత్తి, దుష్టనుని
యంతకునంతికసీమఁ జేర్పఁ, బూ
లాయుధ ! నీవు నేర్పరివి,
ప్రాణి సకృత్యముఁ బట్టి, శిక్షితున్
జేయుదు, నీ దివే నతుల
శేషజగద్గణ చక్రవర్తికిన్. ౭౫

ఉ. కోరినకోర్కె లిచ్చి తమఁ
గొల్చెడి వారలఁ బ్రోచుదేవతా
కారులు, నక్షయాత్మకులుఁ,
గాంక్షిత సిద్ధులరు, స్మహోఘసం
హారులరు, స్సమస్త జగ
దాత్ములరు, స్సహారుద్రమూర్తి సం
చారుల రైన మీకు, ధర
సాగిలి మ్రొక్కెదఁ, బూర్ణభక్తిమై. ౭౬

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీ నాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
నవమ స్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

## దశమోనువాకః

హరిః ఓమ్

ద్రా పే అంధ స స్పతే దరిద్ర న్నీలలోహిత

ఏషాం పురుషాణా మేషాం పశూనాం

మాభేర్మా ఽ రో మో ఏషాం

కించ నామ మత్ ॥ ౧

యా తే రుద్ర శి వా తనూ

శ్శి వా విశ్వాహ భేషజీ

శివా రుద్రస్య భేషజీ

తయా నో మృడ జీవసే ॥ ౨

శ్రీ

# నమోవాకము

## దశమస్తబకము

ఉ. పాపులఁ బారఁ ద్రోలి, బుధ
 పాళుల పాలిటి యన్నదాతవై,
కోపము తాపమున్గెలిచి,
 కోరి విరక్తిని బూనియుందునో
తాపసవేష ! నీలగళ !
 తక్కక యిప్పుడ వచ్చి, మమ్ములన్.
మాపశువర్గము, న్సుఖ స
 మంచితముం బొనరించి ప్రోవవే. ౭౭

శా. మా రోగమ్ముల, మాదులేములఁ త్రుటి
 న్మాయింపుచు, న్మోక్షముం
బారంపర్యముగా నొసంగెడు భవ
 ద్భవ్యంబు శాంతంబు, నా
కారంబు న్వడిబూని మాజనతతి
 న్గల్యాణముల్జెందఁగా,
నీరోగంబయి మాపశువ్రజము, సం
 స్థిపింపఁగ, న్బ్రోవవే. ౭౮





ఇమాగుం రుద్రాయ
తవసే కపర్దినే
క్షయ ద్వీరాయ
ప్రభ రామహే మతిమ్॥ ౩

మృడానో రుద్రోతనో మయస్కృధి
క్షయ ద్వీరాయ నమసా విధేమ తే॥

యచ్ఛంచ యోశ్చ । మనురాయజే పితా
తదస్యామ తవ । రుద్ర ప్రణీతౌ॥ ౪

శా. రాజద్రమ్య జటాకలాప ! పర వీ
రచ్ఛార ! యోరుద్ర ! పూ
పూజలైకొని. వాడవాడలను బెం
పుల్గోరి వర్తించుమా
మా జంతు వ్రజము, న్మనుష్యగణము.
న్మా ప్రాణిసంఘమ్ము న
వ్యాజంబైన కృపాకటాక్షమున, సౌ
ఖ్యశ్రీలఁ దేలింపవే. ౬౯

ఉ. మాదు పితామహుండు, జన
మాన్యుఁడునైన మనుప్రభుండు, సం
పాదన సేసినట్టి శుభ
పద్ధతులెల్లను, మాకుఁ బ్రాప్తము
ల్గాఁదగు దీవనల్సలిపి,
కాంక్షలు తీర్చి సతమ్ము మమ్ము సౌ
ఖ్యోదయులం బొనర్పఁగదె,
యుగ్ర ! మహేశ్వర ! నీకు మ్రొక్కెదన్. ౭౦

మానో మహాంత ముతమానో అర్భకం
మాన ఉక్షంత ముతమాన ఉక్షితం ।
మానో వధీః పితరం మోతమాతరం
ప్రియా మానస్తనువో రుద్ర రీరిషః॥ ౫

మానస్తోకే తనయే మాన ఆయుషి
మానో గోషు మానో అశ్వేషురీరిషః
వీరాన్మానో రుద్ర భామితోవధీ
ర్హవిష్మంతో నమసా విధేమతే॥ ౬

ఉ. మాదు పితామహాదులను,
మా తలిదండ్రులు, మాదు బాలురన్,
మాదు సమర్థనాయకుల,
మా యుదరస్థితులైన బాలురన్,
మాదు ప్రియాంగనామణుల,
మా సఖుల, న్సుసుల, న్సుతమ్ము, స
మ్మోదముులందుఁ దేల్చుచును,
బూర్ణ సుభద్రులఁగా నొనర్పవే. ౭౧

ఉ. మాదు సుపుత్రపౌత్రులను
మాన్య గుణాంచితులన్బొనర్చుచున్,
మాదగు నాయురున్నతుల,
మాదగు గోగణరాజి, మాదు న
శ్వాది పశుప్రకాండమును,
నవ్యయవీరభటాళి, నెప్పుడున్
బ్రోది యొనర్పవే గిరిశ!
పూజ్యుని, నిన్గొలుతున్నమస్తతిన్. ౭౨

ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్నే
క్షయద్వీరాయ సుమ్న మస్మే తే అస్తు ।
రక్షా చ నో అధి చ దేవ బ్రూహ్యథా చ
న శ్శర్మ యచ్ఛ ద్విబర్హాః ॥ ౭

స్తుహి శ్రుతం గర్తసదం యువానం
మృగం న భీమ ముపహత్ను ముగ్రమ్ ।

ఉ. గో నరవీర హింసమెయి
ఘోరతరంబగు నీదుమూర్తి, మా
పూనినచోటఁ జేర్పకువె,
భూరి సుఖప్రదమైన దేహమే.
మానక మమ్ముఁ జేర్పవె, యు
మాధవ! నిచ్చలు మాకు నవ్య యా
న్యూన శుభమ్ము లిచ్చుచు. మ
హోన్నతులన్మముఁ జేయవే శివా! ౧౩

ఉ. ఏది యుగాంతమందున మ
దేభముఁ జూచి నృశంస సింహము
న్మాదముఁ జెంది హింసఁగొను
మాడ్కిఁ జరించుఁ దదుగ్రమూర్తికి
న్మాదు మనోంబుజంబున, న
నారతము న్వెలుగొందునట్టి, స
మ్మోద మహోజ్వలంబయిన,
మూర్తి నుతించుత, నాదు వాగ్ఝరుల్. ౧౪

మృడా జరిత్రే రుద్రస్తవానో
అన్యం తే అస్మన్నివపంతు సేనాః॥ ౮

పరిణో రుద్రస్య హేతిర్వృణక్తు
పరి త్వేషస్య దుర్మతి రఘాయోః।

అవ స్థిరా మఘవద్భ్యస్తనుష్వ మీఢ్వ
స్తోకాయ తనయాయ మృడయ॥ ౯

ఉ. నీ సుతులందు మైమఱచి
నిచ్చలు శోషిలు నాదుదేహముం,
బూని సుఖాబ్ధిఁ దేల్చుటది
ముఖ్యము, దేవ ! మదుగ్రవైరుల
న్మానక, హింసపాల్పఱచి,
మామక జీవముఁగాచునట్లు, నీ
సేనకు నానతిచ్చుటది
చెల్లును, దేవ ! జగత్త్రియార్చితా ! ౧౫

తే. గీ. భయదమైనట్టి రుద్రుని పదుమకత్తి
మాకు బహుదూరవర్తియై మనును గాక
శత్రుసంహార కాలోగ్రశాలియైన
రుద్రుదుర్మతి మాయెడ స్రుక్కుఁ గాక. ౧౬

తే. గీ. ఓ సుఖప్రద ! నీదగునుగ్రమూర్తి
మాకుఁ గన్పింపఁ జేయకు మాదుకోర్కె
లెల్లదీరుచు నోరుద్ర ! యెంతయుఁ గృప
మాదు పుత్రప్రపౌత్రుల మనుపుమయ్య. ౧౭

మీఢుష్టమ శివతమ శివో నస్సుమనా భవ।
పరమే వృక్ష ఆయుధం నిధాయ।
కృత్తిం వసాన ఆచర పినాకం
బిభ్రదాగహి॥ ౧౦

వికిరిద విలోహిత నమస్తే అస్తు భగవః।
యాస్తే సహస్రగ్ం హేతయోఽన్యమస్మ
న్ని వపంతు తాః॥ ౧౧

చం. వరద ! శమప్రధానగుణ
భాస ! మహేశ ! సతమ్ము మా యెడన్
గరుణను బూని, శాంతపడి,
కర్కశమైన త్రిశూలము, న్గృపన్.
వరవట వృక్షమందునిచి,
వ్యాఘ్రపుఁజర్మముఁ బూని, మాకు స
త్వరముగ దర్శనం బిడవె.
బాణవియుక్త ధనుఃకరుండవై . ౧౦౦

ఉ. భక్తజనాళికి న్బహుళ
భాగ్యములిచ్చు విశుద్ధరూప! భీ
యుక్తుఁడనై భవచ్చరణ
యుగ్మమునందున వ్రాలిపోయెదన్.
సక్తిమెయి న్భవత్కరము
నన్వేలుగొందెడు నాయుధావళిన్.
వ్యక్తములం బొనర్చుచు, న
నారతమున్నము బ్రోవవే, శివ ! ౧౦౧

సహస్రాణి సహస్రధా బాహువోస్త్వ హేతయః

తాసామీశానో భగవః పరాచీనా ముఖా కృధి॥ ౧౨

---

ఇతి దశమోనువాకః

సమాప్తః

ఉ. నీదు సహస్ర బాహువుల
నేస్తముగన్న సహస్ర హేతులు,
న్నీదు నధీనముల్గదవె ?
నిచ్చలు మాకుఁ బరాఙ్ముఖమ్ములుం
గాఁదగు నట్లు వానిగతిఁ
గల్పనసేసి, ప్రశాంతమూర్తివై,
మాదు హృదంతరాళమున
మానకనాట్యము సల్పవే, శివా ! ౯౦

---

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీనాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తిచేత రచింపఁబడిన
నమోవాకమ్మునందుఁ
దశమస్తబకము
సమాప్తము

శ్రీ

# నమకమ్

## ఏకాదశానువాకః

హరిః ఓం

సహస్రాణి సహస్రశో యే రుద్రా అధి భూమ్యాం॥

తేషాగుం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి॥ ౧

అస్మిన్మహత్యర్ణవేఽన్తరిక్షే భవా అధి॥ ౨

నీలగ్రీవా శ్శితి కంఠా శ్శర్వా అధః క్షమాచరాః॥ ౩

నీలగ్రీవా శ్శితికంఠా దివగుం రుద్రా ఉపశ్రితాః॥ ౪

యే వృక్షేషుసస్పింజరా నీలగ్రీవా విలోహితాః। ౫

శ్రీ

# నమోవాకము

## ఏకాదశస్తబకము

సీ. భూతలమ్మునయందు భూరిదయాబుద్ధి
భద్రులై వెల్గెడు రుద్రులార!
నీరధిఁబోలు నీతారాపథమ్మందు
భద్రులై వెల్గెడు రుద్రులార!
స్వర్గసీమలయందుఁ బాతాళతలమందు
భద్రులై వెల్గెడు రుద్రులార!
వృక్షసంతతియందుఁ బింజిరాకృతిఁదాల్చి
భద్రులై వెల్గెడు రుద్రులార!
మీదు కరములయందున మెఱయుచున్న
చాపముల విజ్యములఁజేసి సత్వరముగ
మాకు బహుదూరమందున మనెడునట్లు
నిలిపి మమ్మేలుఁడయ్య నిర్నిద్రఫణితి.

యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః॥ ౬

యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషు పిబతో జనాన్ ౭

యేపథాం పథిరక్షయ ఐల బృదాయు వ్యుధః॥ ౮

యేతీర్థాని ప్రచరంతి సృకావంతో నిషంగిణః॥ ౯

య ఏతావంతశ్చభూయాగుం సశ్చ దిశోరుద్రావి తస్థిరే॥ ౧౦

తేషాగుం సహస్రయోజనే వధన్వానితన్మసి॥ ౧౧

## నమోవాకము

సీ. భూతాధినాథులై పొలుపొందుచు సతంబు
భద్రులై వెల్గెడు రుద్రులార!
పానపాత్రలయందుఁ బూనిప్రాణులకు న
భద్రమ్ముఁ గూర్చెడు రుద్రులార!
లౌకికాలౌకిక లక్ష్యాను వృత్తి ని
ర్నిద్రుల నేలెడు రుద్రులార!
చాపాసి హస్తులై సర్వతీర్థములం ద
భద్రులఁ గూల్చెడు రుద్రులార!

తే. గీ. భద్రులై యెల్లెడన్వెల్గు రుద్రులార!
మీదు కరములయందున మెఱయుచున్న
యాయుధమ్ముల మాకు నత్యంతదూర
మందు నిల్పుచు మమ్మేలుఁడయ్య కృపను. ౯౨

ఉ. అన్నమరుత్ప్రవర్షముల
నాయుధరూపమునన్ గ్రహించి యీ
పన్నునమిన్నున స్తవిలి
మాన్యతఁ గాంచెదు రుద్రులార! మీ
కన్నతుల న్నొసర్తు దిశ
పన్నిశకై దుఁబడిం బొసర్చి మా
పన్నతి సౌఖ్యమీయఁ దగుఁ
నుగ్రజనావళిఁ ద్రుంపఁగాఁ దగున్. ౯౨

ఇది మేడిచెర్ల కులాలంకారుండగు శ్రీనాగేశ్వరా
ర్యుని ద్వితీయతనూభవుండైన యాంజనేయ
మూర్తిచే రచింపఁబడిన
నమోవాకమ్మునందు
నేకాదశస్తబకము
సమాప్తము

